చందా వివరాలు
సంవత్సరము చందా 8 పోస్టీ రూపాయలు
ఆరునెలలకు „ 3-10-0 „
బ్రిటిషిండియాలో సంవత్సరం చందా కల్దారు
విడి ప్రతిక 0-1-9
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominions

BEST MEDIUM — FOR — ADVERTISEMENT

Vol. 18 — No 70

Published on every Monday and Thursday· Hyderabad· Dn·

20 - 1 — 1944


## రష్యావారి సామ్రాజ్య కాంక్ష

### మసానిగారి వివరణ

బొంబాయి మేయరుఅగు యం. ఆర్. మసాని గారు జనవరి ౧౬వ తేదీన సిల్వరిరోటరీక్లబ్బులో ఉపన్యసించుచు ఇపుడుపోలాండు, బాల్టికురాజ్యముల వంటి ఇరుగుపొరుగు దేశములతో తనసంబంధము ననుగురించి ఇతరులేమియు మాట్లాడతగదని అనుచున్న రష్యాస్టాలినుగారిమాటకును, భారతదేశపు విషయము తమయింటి వ్యవహారమని అనుచున్న చర్చిల్ గారి మాటకును భేదమేమి — అని ఆక్షేపించిరి. యుద్ధానంతరము పోలాండుమాత్రమే గాక యూరపుఖండపు ప్రాగ్భాగమందును, మధ్యభాగమందునుఉండు అనేకములైన ఇతరదేశములు కూడ రష్యావారి సామ్రాజ్యములో సామంతములు కాగలవని మసానిగారనిరి. పోయినకొద్దిఏండ్లలో రష్యా సామ్యవాదసిద్ధాంతమునను సరించిన వ్యవస్థను అంతకంతకు దూరమైనదని మసానిగారనిరి. ఇపుడురష్యా సామ్యవాదముప్రకారముఉండవలసిన వ్యవస్థకు చిరునయగుచు డుట లేదు. నియంతలకులోబడిన పరిపాలనగలవ్యవస్థ తేని దే సామ్యవాదమునను సరించిన వ్యవస్థను స్థాపించ లేమని రష్యావారు ఇతరదేశములను సహాలు చేయుచున్నారు. సమిష్టిగ భారతీయప్రజలు అహింసనుఅవలంబించి, ఆస్తులుగలవారలు వాటిని ప్రజలపక్షమున ధర్మకర్తలుగ ధరించియున్నట్లు భావించుకొని తదనుగుణముగ వర్తించుచు, పరిశ్రమలనని ఎక్కువభాగము పల్లెలలో కుటీరపరిశ్రమలకు పరిచబడి, ఈ విధము గాంధిమహాత్ముని విధానము అవలంబించబడినచో రష్యాసవాలుకు ఇండియాజవాబిచ్చినట్లేయనిమసానిగారనిరి.

## దయ్యపుచర్యలు!

సంయుక్తరాష్ట్రములందు హాసనూ ప్రదుగ్రామములో ఎక్కువగా ముసల్మానులఇండ్లలో కుంపట్లపై తయారుచేయబడుచుండురొట్టెలు గాలిలోకి ఎగిరిపోవుటయు, పాలకుండలుకూడ అట్లే ఎగిరిపోయి క్రిందపడినపుడు చూడగా వాటిలో పాలు లేనట్లును, కుండలు ఏమాత్రముపగలకుండ క్రిందికి పడుచున్నట్లును గ్రామస్థులు గమనించినట్లు ఒక వార్త 'హిందూస్థాన్ టైమ్సు' పత్రికకు దాని అలహాబాదు విలేఖరి పంపించినాడు. ఆ గ్రామములో మంటలు లేచుటయు, వాటినిఆర్పివేయుటకై జనులుపోవునప్పటికి అక్కడమంటలే లేకుండుటయు కూడ గమనించబడినది. ఇవన్నియు దయ్యముల చర్యలని భావించుచున్నారు.

## కాఫీహోటళ్లపై జనులగుంపు దాడి

బెజవాడలో ఒక కాఫీహోటలులో కొందరు కమ్యూనిస్టులకును కొందరు ప్రజలకునుఘర్షణ జరిగెను. అదియొక పెద్దపోరాటముగ పరిణమించెను. జనులగుంపొకటి కమ్యూనిస్టుపార్టీ వారికార్యాలయములో దూరి అందుండిన ఎరలను కొట్టెను. పోలీసువారువచ్చి అల్లరిఆపిరి. ౧౭మందినిఅరెస్టు చేసి జమానతుపై వదలిరి. అల్లరిపుట్టినచోట రిజర్వుపోలీసుల కాపలా పెట్టినది

### అసఫ్ అలీగారి సతికారు వేలము

క్రొత్తఢిల్లీలో జనవరి ౧౬వ తేదీ ఆసఫ్ అలీ సతిగారి సొత్తువేలము వేయబడెను, వాటిలో బేబీ ఆస్టిన్ కారు ఒక రూ 3౫౦౦లకు కొంచెమెక్కువ పాటపాడినవారికి ఇచ్చివేయబడెను. అసఫ్ అలీగారి సతినిపోలీసులు పట్టుకొనదలచగా ఆమెపారిపోయినట్లు ప్రభుత్వమువారు ప్రకటనచేసి ఆమె సొత్తును వేలమువేయించినారు,

## భూకంపముచే ఒక నగరము తయు ధ్వంసమగుట

జనవరి ౧౫వ తేదీ రాత్రి అర్జంటైనాలో అనేక రాష్ట్రములు భూకంపముచేవణకిపోయినవి, శాన్ జువాన్ అనుపట్టణము దాదాపుపూర్తిగా ధ్వంసమైనది. భూకంపము ౩౦నిమిషములపాటు ఉండెను,

## సేఫ్టీరేజర్లపైకి ఫైజాబాదు మంగళ్లదాడి

ఫైజాబాదులో మంగళ్ళుఒకసభ చేసిఅనేకులు సొంతముగా క్షౌరములను జేసుకొనుచుండుటవల్లమంగళ్ళవృత్తికి నష్టముకలుగుచున్నదికాబట్టి సొంతక్షౌరము దోషమనియు, యుద్ధానంతరము సేఫ్టీరేజర్లుఎక్కువ యైమంగళ్ళవృత్తికి ఇంకను ఎక్కువనష్టము కలుగగలదనియు, అందువల్లప్రభుత్వమువారు సేఫ్టీరేజరులను,వాటి బ్లేడులను ఎన్నటికిగానిఇండియాలోకి రాకుండానిషేధించవలెనని యుతీర్మానము చేసినారు.

మరియువారు తమకున్యాయమైన క్షౌరపుకూలులభించునట్లు చేసికొనగల్గుటకై మంగళ్ళసంఘము ఏర్పాటుచేసుకొని దానిద్వారా బాధ్యతచాంద నిర్ణయించిరి.

### జయించినపుడు జర్మనీఆక్రమణకై అనుకొన్న ఏర్పాటు

పర్షియాలో టెహిరానునగరంలో చర్చిల్, రూజ్వెల్టు, స్టాలినుగారలుకలిసి ఆలోచనలు చేసినపుడు జర్మనీని ఓడించినతర్వాత దానిఆక్రమణకై బ్రిటను, రష్యా, అమెరికాసంయుక్తరాజ్యములు తలకొకమూడవవంతు జర్మనీభాగము నాక్రమించుటకు చాలినసేనలను ఉంచవలసియుండునని ఒక సూచననుగురించి చర్చచేయబడినట్లు వాషింగ్టన్ నగరమునుండి ప్రకటితమగు "ఆర్మీ అండు నేవీ జర్నల్" యొక్క జనవరి౧౬వ తేదీనాటి సంచికలో తెలుపబడినది. ఆసూచన ఒప్పుకొనబడెనో లేదో తెలుపబడలేదు,

### తప్పించుకొని తిరుగుచున్న వారి అరెస్టు

బీహారు రాష్ట్రములో అర్రాజిల్లాలో ఒక గ్రామమందు ఒకయింటిని స్పెషల్ బ్రాంచి పోలీసులు సోదాచేసి తప్పించుకొని తిరుగుచున్న నలుగురు రాజకీయ సేవకులలో కలిపి రాను దిని అరెస్టుచేసినట్లు జనవరి౧౧వ తేదీన పాట్నాకు తెలిసినది.

అరెస్టుచేయబడినవారలను గట్టి పోలీసు కాపలాతో అర్రాకు తెచ్చినారు (యు ప్రె)

## ముస్లిం భాగవతులకు ఆంక్ష

మ.ఘ.వ. నిజాంప్రభువుగారు ప్రెసు సేవక్రాన్ లో ఇట్లు వ్రాసియున్నారు,

ముందుసంవత్సరముదుండు ఈ జనులు (అనగా భాగవతులు జాకిరీన్ అని అర్థము) ప్రభు సెలవు లేనిది ఈరాష్ట్రములో మొహర్రములో రాజారు. ఇదికష్టకాలము కావున భద్రము గాను డుబ అవసరం. ఎవరైతే ముస్లింభాగవతులను పిలువదలచినారో వారు ముందుగా కొత్వాలు ద్వారా గవర్నమెంటు సెలవుపొందవలెను లేకుంటే ఎలు చేవారు వచ్చేవారు బాధ్యులైయుందురు ఇక్కడి స్థితిగతులు తెలియక వారువారపాటుచేయవచ్చును ఆపత్తులలో ఇరుకకొనవచ్చును దీని నిరోధం అవసరం. గవర్నమెంటు యొక్క - న్యాయాపొందే ముస్లింభాగవతులఆజ్ఞకుఅపవాదపాత్రులు. ఎంచుకంటే వారిచర్యలు అన్నివిధాల నమ్మకమైనవి.

## కీ. శే. శకుంతలమ్మగారు

సికింద్రాబాదులో పరోపకారిణీ బాలికా పాఠశాలయొక్క గౌరవపర్యవేక్షకురాలగు శ్రీమతి శకుంతలమ్మగారు జనవరి౧౦వ తేదీ రాత్రి స్వగృహమందు మరణించిరి. ఆమెను కొంతకాలము నుండి జబ్బుగానుండెను ఆమెభర్తయు, ఒకరు బిడ్డలును, తల్లిదండ్రులును, ఆమె విద్యార్థినులును ఈ మరణమునకై శోకించుచున్నారు.

కీ. శే. శకుంతలమ్మగారు ఆపాఠశాలస్థాపకురాలగు సీతమ్మగారినిర్యాణానంతరము, పాఠశాల నిర్వహణభారమువహించి ప్రశంసనీయముగా పనిచేసినారు. ఇప్పుడు పాఠశాలపొందియున్న అభివృద్ధికి వారే కారణము. ప్రతిఏటు ఆమెగారుబాలికలకు నాటకముల ప్రదర్శనములనునేర్పి నాటకములాడించి, తన్మూలమున పాఠశాలకుధనమును ఆర్జించినారు

ప్రాథమిక విద్యాభివృద్ధికై శకుంతలమ్మగారు చేసినసేవ సీతమ్మగారుసాధించినదానికి వన్నెపెట్టినది,

ఆమెగారు మంచి వ్యావతియు, ఉదారాశయయునై నలుగురితోకలిసి మెలిసియుండు స్వభావముగలవారు.

ఆమెగారితండ్రియగు శ్యామారావు గారికినివారి కుటుంబములకును మా సానుభూతి తెలుపుచున్నాము.

### హైద్రాబాదు రేడియో తెలుగు కార్యక్రమం

రోజూ ౭-౫౫నుండి ౮-౫వరకు తెలుగులో వార్తలు వినిపించబడును.

శనివారం, ౧౫వఇస్ఫందారు, ౧౩౫౩ సాయంత్రం ౭నుండి౭-౧౫వరకు "రామసింగు" ప్రసంగం.

మంగళవారం, ౧౮వఇస్ఫందారు, ౧౩౫౩నాడు సాయంత్రం ౭నుండి ౭ ౧౫వరకు "కావ్యగానం" శ్రీ లక్ష్మణశాస్త్రిగారు,

శనివారం, ౨౨వఇస్ఫందారు ౧౩౫౩ఫ నాడు సాయంత్రం ౭నుండి ౭ ౧౫వరకు "హైద్రాబాదులో నీటిపారుదల" శ్రీ. రామమోహన్ గారు,

మంగళవారం, ౨౫వఇస్ఫందారు ౧౩౫౩ ఫ నాడు సాయంత్రం ౭నుండి ౭-౧౫వరకు కథానిక శ్రీమతి, భారతీప్రభాకరరత్నాకరాంబగారు

## బెంగుళూరులో స్వాతంత్ర్యదినోత్సవ నిషేధము

బెంగుళూరు సివిల్ మిలిటరీస్టేషనులో జనవరి ౨౬తేదీ కాంగ్రెసువారు ఏర్పాటుచేసిన స్వాతంత్ర్యదినోత్సవసంరంభమున ఊరేగింపులనుగాని, సభలనుగాని, మరిఏ ప్రదర్శనములనుగాని జరుపరాదనియు, ఈ విధమైననిషేధాజ్ఞను ఆక్షేపించుకొనుటకు కూడ ఎట్టిసభలనుగాని చేయరాదనియు బెంగుళూరు జిల్లామేజిస్ట్రేటు జనవరి౨౦వ తేదీన భారతదేశరక్షణనియమావళి ననుసరించి ఆజ్ఞచేసినారు. ఈఆజ్ఞను ఉల్లంఘించినవారికి మూడేండ్లవరకైనను, లేదా జుర్మానా, రెండుకలిపిశిక్షగా విధించబడవచ్చును ప్రజాక్షేమార్థమై ఈ ఆజ్ఞ చేయబడినట్లు తెలుపబడినది

## ఫ్యాక్టరీవర్కర్సు యూనియన్ మధిర

మధిరలోరెండు ఫ్యాక్టరీలున్నవి. దాదాపు ౧౫౦మంది కార్మికులుకలరు. ప్రజలజీవితావసరాలుఖర్చు దినదినముపెరిగి పోతున్నయీరోజులలోకూడ కార్మికులకూలీ యథాప్రకారముగానే వున్నది కార్మికులుతమ కోర్కెలనుయీడేరుకొనుటకై సంఘమువిర్పాటు చేసుకున్నారు. శ్రీ మేడు వెంకటపతిసంఘ కార్యదర్శిగానున్న కోబద్దాడు సంఘమునిరఫున ఆజ జాహిమిల్లు కార్మికుల సహాయార్థము ౧౦౦వసూలుచేసి పంపనైనవి

వాసిరెడ్డి వెంకటపతి,
కార్యదర్శి.

### వార్త

నారాయణగూడెములో నున్న బాలికల ఉన్నత పాఠశాలయొక్క అభివృద్ధి స్కీమును అమలులోపెట్టుటకై రెండువేల రూపాయల విరాళమును శ్రీ శ్రీ రాజాసురభివెంకటజగన్నాథరావు బహాదరు, (జటప్రోలు సంస్థానాధీశ్వరులు) గారు వాగ్దానమొనర్చిరని తెలియుచున్నది

## సాహిత్యోపన్యాసాలు.

(ఓ. వి.)

౯,౧౦,౧౧, జనవరితారీఖులలో క్రమంగా కొండాపురం దోసపాటుల, కోటైరూడెంగ్రామాలలో శ్రీమాన్ పండిత దాశరథికృష్ణమాచార్యకవిగారి సాహిత్యోపన్యాసములు, కావ్యగానములు మహోత్సాహముతో జరిగినవి సాహిత్యమేఖలా గ్రంథమాలా సంచాలకులు, పులిజాల హనుమంతరావు గారు కవిగారిని అర్థశతంతో సన్మానించిరి. కవిగారు, చందూరు, ఆప్రాంతపు రచయితల రచనలను చూచివారికిప్రోత్సాహము నొసంగుతూ ౧౧జనవరి నాడు తమనివాసస్థానమగు ఖమ్మంమెట్టు కొనిరి.

### కమ్యూనిస్టుఖైదీవిడుదల

కర్నూలు, జనవరి౧౭

౧౫౨౦వ ఏప్రిల్ ౨౫వ తేదీను డిటెన్యూఖైదీగానున్న సి. పుల్లారెడ్డి అనుకమ్యూనిస్టును తంజావూరు జెయిలునుండి ఎట్టిషరతుగాని పెట్టకుండ వదలివేసినారు.




Khan and Sons

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn. Editor S. Prathap Reddy, B.A., B.L.